**లక్ష పసుపు నోము :-**

**కథ**

**ఒక వూరిలో ఒక బ్రాహ్మణ ఇల్లాలు వుండేది. ఆమె భర్త రూపసి, విద్యావంతుడు. గౌరవంగా బతకడానికి తగినన్ని సిరిసంపదలు వున్నవాడే అయినా తరచూ అనారోగ్యాల పాలబడుతూ వుండేవాడు. భర్త అనారోగ్యాల వల్ల, ఆ బ్రాహ్మణ ఇల్లాలు ఏ సుఖానికీ నోచుకోక ఏడుస్తూ వుండగా, ఆ వూరికి వచ్చిన ఒక యతీశ్వరుడు, ఆమె చేసిన అతిథి సత్కారాలకు ఆనందించి, ఆమె పరిస్థితిని దివ్య దృష్టితో తెలుసుకొని "సాధ్వీమణీ ! చింతించకు. లక్ష పసుపు నోము నోచి ఉద్యాపన చేసుకుంటే అన్నీ చక్క బడుతాయి " అని చెప్పాడు. ఆమె అలాగే చేయగా, అది మొదలామె భర్త అనారోగ్యమనే ప్రసక్తి లేకుండా, ఆఖరికి జలుబయినా లేకుండా పూర్ణాయువుతో జీవించాడు. భార్యకు ఎనలేని సుఖం ఇచ్చాడు.**

**విధానం**

**ఆరు నెలల పాటు ప్రతిరోజూ పై కథ చెప్పుకుని, తలపై అక్షతలు వేసుకోవాలి. ఏడవ నెల మొదటి రోజున ఉద్యాపన చేసుకోవాలి.**

**ఉద్యాపనం**

**వెన్ను విరగని పసుపు కొమ్ములు లక్ష ఏరి పెట్టుకుని, తగినంత కుంకమతో శ్రీ మహా లక్ష్మీని గాని, శ్రీ గౌరీని గాని, ఎవరో ఒక అమ్మవారిని పూజించాలి. ఆ పసుపు కొమ్ములూ కుంకుమ తీసుకుని యింటి చుట్టూ వున్న వీధులన్నీ తిరిగి యింటింటా పంచిపెట్టాలి. ఏ ఇంట్లోనూ కూడా దోసెడుకు తక్కువగా పసుపు కొమ్ములివ్వకూడదు. తగినంత కుంకుమ కూడా యివ్వాలి. శక్తివంతులు పిండివంటలు కూడా పంచుకోవచ్చు.**

*******